## హిందీ శిక్షణా విద్యాలయం

### సమావర్తనోత్సవం

హైదరాబాద్, ఏప్రిల్ 4: ఉన్నత పాఠశాలల్లో పని చేస్తున్న హిందీ పండితులకు శిక్షణ ఇచ్చేందుకు హైదరాబాద్ హిందీ ప్రచార సంఘం యాజమాన్యాన ఇక్కడ ఏర్పాటైన హిందీ శిక్షణ విద్యాలయం సమావర్తనోత్సవం వ్యవసాయశాఖ మంత్రి డాక్టరు చెన్నారెడ్డి అధ్యక్షతన నిన్న జరిగింది. మొత్తం 38 మంది విద్యాలయంలో శిక్షణ పొందారు. అతిథులకు హిందీ ప్రచారసంఘం కార్యదర్శి శ్రీ అంజనేయశర్మ స్వాగతం చెప్పారు. విద్యాశాఖ కార్యదర్శి శ్రీ గౌసు మొహియుద్దీను ప్రసంగించారు. విద్యాలయ ప్రధానాచార్యులు శ్రీ జగన్మోహన తిరువేది విద్యాలయ నివేదిక చదివారు. విద్యార్థి సంఘ నివేదికను శ్రీ సరోజ చదివారు. హైదరాబాద్ హిందీ ప్రచార సంఘం కృషిని డాక్టరు చెన్నారెడ్డి ప్రశంసించి సంస్థకు చేయూత నివ్వమని ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

కుమారి విష్ణుప్రియ భరత నాట్యం చేసింది. 'సమర్పణ' అనే హిందీ నాటికను విద్యార్థులు ప్రదర్శించారు. శ్రీ ఆర్. ఎమ్. జోషీ వందన సమర్పణ చేశారు.

## కాకినాడ దళిత జాతుల సంఘం

కాకినాడ, ఏప్రిల్ 6. కాకినాడ దళితజాతుల సంఘానికి ఈ క్రింది కార్యవర్గం ఎన్నికైనారు అధ్యక్షుడు-శ్రీ డి. చంద్రారావు; ఉపాధ్యక్షులు - శ్రీ కె. వీరన్న, శ్రీ పి. రామస్వామిగారలు; కార్యదర్శి - శ్రీ ఆర్. వెంకటరత్నం; సహాయ కార్యదర్శి - శ్రీ బి సూర్యారావు, కార్యవర్గ సభ్యులు-శ్రీయుతులు ఎల్. మహాలక్ష్మి, ఆర్. అప్పన్న, పి. ముసలయ్య, పి. తాతయ్య, ఎస్. అచ్చన్న, జి. వెరలయ్య, బి. నవరయ్య, శ్రీమతి బి. శేషారత్నంగారలు.

### కాకినాడ రోటరీ క్లబ్

కాకినాడ రోటరీక్లబ్‌కు ఈ క్రింది క్రొత్త కార్యవర్గం ఎన్నికైనారు: అధ్యక్షుడు-డాక్టరు ఐ. భోగారావు; ఉపాధ్యక్షుడు - డాక్టరు కె. చంద్రారావు కార్యదర్శి-డా॥ కస్తూరి వెంకటచలం; సహాయ కార్యదర్శి శ్రీ లక్కరాజు సత్యనారాయణ; కోశాధికారి-శ్రీ టి. వి. రంగారావు; కార్యవర్గ సభ్యులు - శ్రీయుతులు టి. డి ప్రసాదరావు, వై. నారాయణరావు, డా॥ కె నరసింహారావు, రేపాక సత్యనారాయణమూర్తి, యు. వెంకటరత్నం, ఎం. సూర్యనారాయణగారలు.

కాకినాడ వైద్యసంఘం సమావేశం డా॥ సుంకవల్లి అధ్యక్షతన. కిందటినెల 31 వ తేదీన జరిగింది. డా॥ పి. సదాశివన్, డా॥ కె చంద్రారావుగారలు ప్రసంగించారు.

క్రొత్త సంవత్సరానికి డా॥ కె. చంద్రారావు, బి. వెంకటరాజు గారలు అధ్యక్ష ఉపాధ్యక్షులుగా ఎన్నికైనారు డా॥ ఎస్. ఎ. పంతులు, కె. నరసింహారావుగారలు ప్రధాన కార్యదర్శి సహాయ కార్యదర్శులుగా ఎన్నికైనారు.

## దేశ సేవకు 8 లక్షల మంది సాధువులు

### హృషీకేశ్‌లో సమావేశం

ఢిల్లీ, ఏప్రిల్ 9: దేశంలో 8 లక్షలమంది సాధువులు (సన్యాసులు) ఉన్నారు. చాలామంది కాషాయాంబరాలు ధరించే కపటసన్యాసులైనా, ఈ 8 లక్షలలో చాలా మంది, నిజమైన త్యాగబుద్ధి సేవానురక్తి ప్రజ్ఞ దేశభక్తి గలవారే. చాలా నీతివంతులు. ప్రజల ఆధ్యాత్మికాభివృద్ధికి కృషి చేస్తున్నవారు అనేకులున్నారు. వీరికి చాలామంది శిష్యులున్నారు.

భారత సాధుసేవక్ సమాజ్ స్థాపనతో ఈసాధువుల ప్రజ్ఞ, వారిశిష్యుల అభిమానం, అభివృద్ధి కార్యక్రమాల రంగానికి లభించసాగాయి. భారత సేవక్ సమాజ్ అధ్యక్షుడు శ్రీ నెహ్రూ ఈసాధువుల సహాయం లభిస్తున్నందుకు చాలా సంతోషించారు. వారి త్యాగనిరతికి తగ్గట్టు సేవానురక్తిని కూడా ప్రణాళిక సానుకూలం కావడానికి వినియోగించుకునే అవకాశం లభించటం అదృష్టం. వీరు, హృషీకేశ్‌లో నేటి నుంచీ రెండు రోజులు సమావేశమై ఈ క్రింది కార్యక్రమాన్ని పరిశీలిస్తారు. అక్షరాస్యతకు కృషి. బృందగానాల (భజనలు, కాలక్షేపాలు. (ప్రార్థనలు) ఏర్పాటు, సాధువులశిక్షణ శిబిరాలు, ప్రకృతి చికిత్స, ఆయుర్వేద చికిత్సలు, భూదానం, సంపత్తిదానం, శ్రమదానం, అవినీతి నిర్మూలన,ఆహార పదార్థాలను కలుషితం చేయడాన్ని నిరోధించడం, మద్యనిషేధం, పసుసంరక్షణ, కుటీర పరిశ్రమలు, వెనుకపడినజాతుల పునరుద్ధరణ.

మత విశ్వాసాలను ప్రచారం చేసే సాధువులకు ఇందులో ప్రవేశం వుండదు.

### అగ్నిప్రమాదం

మదనపల్లి, ఏప్రిల్ 9: బాసినకొండ గ్రామ సమీపంలోని, దొనకొండబురుజు గ్రామం పూర్తిగా తగులబడిపోయింది. మొత్తం 70 ఇళ్లలోనూ, ఒక్కటికూడా మిగులలేదు. నష్టం రూ. 10 వేలు ఉంటుందని అంచనా.















## స్టాలిన్‌ను కాదన్నా స్వరూపం మారలేదు

### అంతర్జాతీయ సోషలిస్టు సంస్థ విమర్శ

లండన్, ఏప్రిల్ 8: స్టాలిన్ "వ్యక్తిపూజ'ను ప్రవేశపెట్టినట్లు ఎన్ని విమర్శలు చేసినా, రష్యాలో కమ్యూనిస్టు విధానాలలో మార్పు లేదని అంతర్జాతీయ సోషలిస్టు సంస్థ విమర్శిస్తున్నది.

ఇక్కడ ఈ సంస్థ సభ్యులు కొన్ని సమావేశాలు జరిపి ఇలా ప్రకటించారు. నయానో భయానో స్టాలిన్ చర్యలను సమర్థించామని ఎవరు ఏమి చెప్పినా, కమ్యూనిస్టు పరిపాలనలో మార్పు రాలేదు. సామూహిక నాయకత్వం ఏర్పడినా, నియంతృత్వం మాత్రం తప్పదు. వీరు చెప్పే 'లెనినిజం' స్టాలిన్ సిద్ధాంతాలపై అపార్థాల సంపుటమే"

### కొనుగోలు పన్ను సరిగా చెల్లించండి

మద్రాసు, ఏప్రిల్ 8: శ్రీ తెల్లాకుల జాలయ్య ఈ ప్రకటన చేస్తున్నారు: బియ్యం పంచదార పసుపు కొబ్బరి కొబ్బరికాయలు నార వీటిని ప్రభుత్వం వసూలు చేసే కొనుగోలు పన్ను విధించుటకు మధ్యరకము చిల్లర వర్తకుల క్షేమముకోసము తప్పుకొనినారు. త్వరలో బిల్లు అమలులోకి వచ్చునుగాన వర్తకులు బిల్లు లేనిదే సరుకులు కొనవద్దు. అట్లా కొన్న ఎడల చాలా చిక్కులపాలు అగుదురు. గావున ప్రభుత్వమునకు రావలసినపన్ను సరిగా చెల్లించు విధానమును అవలంబించదగోరెదను. పన్ను చెల్లించిన అనంతరం వర్తకులు ప్రభుత్వమునుంచి అన్ని రక్షణలు పొందవచ్చును. మధ్యరకం చిల్లర వర్తకులను పన్ను బాధనుంచి తొలగించినందుకు ప్రభుత్వమునకు ధన్యవాదము లర్పిస్తున్నాను.

## ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

### వివిధగ్రామాలలో సప్తాహ ఉత్సవాలు

మద్రాసు, ఏప్రిల్ 8: ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆశయాలు, లక్ష్యాలు, గురించి ప్రజలకు తెలియజేయడానికి, ప్రణాళికను జయప్రదం చేయడంలో ప్రభుత్వంతో ప్రజలు ఏ విధంగా సహకరించగలరో, విశదం చేయడానికి, రాష్ట్రంలో వివిధ గ్రామాలలో, 7 రోజులపాటు ఉత్సవాలు యేర్పాటుచేయబడినవి. వాటిల్లో కొద్ది గ్రామాలనుండి అందిన వార్తలు యీ దిగువ పొందుపరుస్తున్నాం.

#### ముదునూరు

8 వ తేదీన రెండవ పంచవర్ష ప్రణాళికా సప్తాహము "వీరవల్లి జాతీయ విస్తరణశాఖ"వారిచే జరుపబడినది జెండా ప్రతిష్ఠాపన శ్రీ సుంకర, దశరథ రామయ్య జరిపారు. ఉదయం ఊరేగింపు సాయంత్రం ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు ఆటల పోటీలు జరిగినవి. "బాలరాజ్యం" వారి చిత్రపటప్రదర్శనను శ్రీ సుంకర దశరథ రామయ్య ప్రారంభోత్సవం చేశారు. శ్రీ యల్. నారాయణమూర్తి అధ్యక్షతజరిగిన సభలో శ్రీ సుంకర, దశరథ రామయ్య జాతీయ ప్రణాళికలను గూర్చి, పశ్చిమ కృష్ణ భారత సేవక సమాజ్ కన్వీనర్ శ్రీకలవాల, సూర్యప్రకాశరావు ద్వితీయ పంచవర్షప్రణాళికను గూర్చి ఉపన్యసించారు. ఆటలపోటీలలో గెలిచినవారికి బహుమతులు పంచిపెట్టారు. "బాలరాజ్యం" వారు "శుభోదయం" అను నాటిక ప్రదర్శించారు. రాత్రి "పంచాయతీ అధ్యక్షుడు శ్రీ తుమ్మల రామయ్య ఏర్పాటు చేసిన విందులో గ్రామములోని వివిధ కులములవారు 100 మంది పాల్గొన్నారు.

### గూడూరులో లారీ ప్రమాదం: ఒకని మృతి

గుండూరు, ఏప్రిల్ 8: క్రిందటి సోమవారం తూర్పు గవిడిలో, మద్రాసు నుండి వస్తున్న లారీ, ఒకటి కట్టెలబండికి గుద్దుకొన్నందున, బండి మనిషి లారీ క్రిందపడి తల పగిలి తక్షణం మరణించాడు. బండిపై పడుకొని ఉన్న మరొకరికిమణికట్టు విరిగింది. బండి నుగ్గైపోయింది. పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు.

## హోటీసుంచి కల్దారుకు మార్పులో సమస్యలు

### ధరల వ్యత్యాసాల మూలంగా

(స్వంత విలేఖరి)

హైదరాబాదు, ఏప్రిల్ 8: హాలీ సిక్కా చెల్లుబడి కాలాంతం సమీపిస్తున్న ఈ తరుణంలో, రాష్ట్ర కార్మికులలోను, జీతవాలపై ఆధారపడే ఇతర ఉద్యోగులలోను తీవ్రమైన ఆందోళన బయల్దేరింది

హాలీసిక్కా రద్దుచేయగానే, అత్యవసర వస్తువులధరలను అదివరకు హాలీల్లో చెల్లించే మొత్తాలనే ఇప్పుడు కల్దారులో ప్రజలు చెల్లించవలసి వస్తున్నది అంటే ప్రజలు ప్రతి నూరు రూపాయల ఖరీదుకు రూ 16 10-0 అధికంగా చెల్లిస్తున్నా రన్నమాట. ఇది చిల్లరఖరీదులు చేసే కనీసాదాయాల వారికి తీరని భారంగా పరిణమించింది. ధరల విషయం ఈ విధంగా వుండగా వీరికి వచ్చే ఆదాయం హాలీలకు సరిసమానమైన కల్దారులలో లభిస్తున్నవి. దీనితో రెండువిధాల ప్రజలు నష్టపడవలసి వస్తున్నది.

కార్మికసంస్థలు, ఇతర ప్రజానాయకులు రెండు సంవత్సరాలక్రితం ఆందోళన కొనసాగించినప్పుడు, హాలీ రద్దువలన జీతనాల స్థితిపై పడే ప్రభావాన్ని విచారణచేసి తగు సిఫార్సులు చేయవలసిందిగా, రాష్ట్ర ప్రభుత్వం జీతనాల బోర్డులను ఆయా పరిశ్రమలకు సిఫార్సులు చేసింది. ఈ బోర్డులలో ప్రభుత్వాధికార్లతోపాటు అనధికారులుకూడా వున్నారు. ఈ బోర్డులు సమగ్రమైన విచారణజరిపి సంవత్సరం క్రితమే సిఫార్సులను ప్రభుత్వానికి అందజేసినా, వాటిని అమలు పరచేటందుకు ప్రభుత్వ మేలాంటిచర్య ఇంతవరకు ఎందుకో తీసుకున్నట్టు కనపడదు.

జీతనాల బోర్డుల సిఫార్సులను ఆమోదించి అమలు పరచేటందుకు ప్రభుత్వంపై వత్తిడి తీసుకురావాలని రాష్ట్రంలోని ప్రధాన కార్మికపక్షాలన్నీ నిర్ణయించినవి. భా. జా. ట్రే. యూ. కాంగ్రెస్ సత్యాగ్రహం చేయాలనికూడా నిశ్చయించింది.

ఇటీవల ఆహారధాన్యాల ధరలలో పొడసూపిన విపరీతమైన పెరుగుదల ఈ సమస్యను ఇంకా విషమింపజేసింది.

### కల్దారులో జీతాలు అవసరం

అఖిలభారత బొగ్గుగనుల కార్మిక సంఘ కార్యవర్గం, ఈ నెల 14 న, బెల్లంపల్లిలో శ్రీ టి. అంజయ్య అధ్యక్షతన సమావేశమై, బొగ్గుగనుల కార్మికులకు ప్రస్తుతం హాలీల్లో చెల్లిస్తున్న జీతనాలను, అందుకు సమానమైన కల్దారులలో చెల్లించాలని కోరే విషయమై ఆలోచన చేస్తుంది

ఈ సంఘం, భారతజాతీయ ట్రేడ్ యూనియను కాంగ్రెస్‌కు అనుబంధిత సంస్థ.

జీతనాల సంఘ సిఫార్సులపట్ల తమ విధానాన్ని హైదరాబాదు ప్రభుత్వం ప్రకటించినందున, నిరసనగా సత్యాగ్రహం చేయాలని, భారత జాతీయ ట్రేడ్ యూనియను కాంగ్రెస్ హైదరాబాదుశాఖచేసిన నిర్ణయం గూర్చి కూడా కార్యవర్గం చర్చిస్తుంది.

### కోహినూర్ గ్లాస్ ఫ్యాక్టరీ

భా. జా. ట్రేడ్ యూనియను కాంగ్రెస్, హైదరాబాదుశాఖ అధ్యక్షుడు శ్రీ టి అంజయ్య, స్థానిక కోహినూరు గ్లాస్ ఫ్యాక్టరీ యజమానులను కలుసుకొని, ఫ్యాక్టరీ కార్మికులకు జీతనాలను ప్రస్తుతం ఇస్తున్న కూలీలలకు సమానంగా కల్దార్లలో ఇవ్వమని కోరారు. ఈ విషయంలో జీతనాలబోర్డు సిఫార్సును అమలుజరుపుతామని యజమానులు హామీ ఇచ్చినట్టు తెలుస్తున్నది. కొందరు తాత్కాలికోద్యోగులను స్థిరపరచేటంగుకుకూడా యజమానులు అంగీకరించారని తెలుస్తున్నది.

### చోరీ అయిన నగల స్వాధీనం

#### చెమళ్లమూడిలో

గుంటూరు, ఏప్రిల్ 8: నర్సారావుపేట తాలూకా అన్నవరం గ్రామస్థురాలు శ్రీమతి రెంటపాటి అనంతమ్మకు చెందిన నగలు, రొక్కం, (మొత్తం రు. 4750) తాలూకా పోలీసు స్టేషన్ ఇన్‌స్పెక్టరు శ్రీ ఎ. శ్రీరామరావు సబ్ ఇన్‌స్పెక్టరు బాల సుందరం పట్టుకొన్నారు.

శ్రీమతి అనంతమ్మ వృద్ధురాలు. కాలినడకన యాత్రలుచేసుకొంటూ, చెమళ్లమూడి (గుంటూరుతాలూకా) గ్రామం చేరి, అక్కడ ఒకరియింట బసచేసింది. ఆమె దగ్గర వున్న డబ్బు, నగలు అంతా మొత్తం రు 4750 కిమ్మతుని ఆ ఇంట్లో బస చేస్తుండగానే పోయినవి. ఈ సంగతి ఫిర్యాదు చేయగా, తాలూకా పోలీసు ఇన్‌స్పెక్టరు శ్రీ రామరావు, సబ్ ఇన్‌స్పెక్టరు ఎం. బాలసుందరం, చెమళ్లమూడిలో ఆమె బసచేసిన ఇంట్లో నుంచి, నగలు, రొక్కం యావత్తు స్వాధీనం చేసుకోగలిగారు.

## భారతదేశంచే "తృతీయ ప్రాంతం" ఏర్పాటు!

### పాక్ విదేశాంగమంత్రి ఆరోపణ

ఢాకా, ఏప్రిల్ 8: తటస్థులము అని చెప్పుకునే రాజ్యాలలో భారత దేశం ఒక 'తృతీయప్రాంతం' ఏర్పాటు చేయాలని ప్రయత్నిస్తున్నదని పాకిస్తాన్ విదేశాంగమంత్రి శ్రీ హమీదుల్ హక్ చౌదరి ఆరోపించారు.

కాశ్మీరు సమస్యను భద్రతామండలికి నివేదించనున్నామనీ, కాశ్మీరులో (భారతదేశం) జరపబోయే ఎన్నికలు 'జనవాక్య సేకరణ' క్రిందకు లెక్కరావనీ శ్రీ చౌదరి అన్నారు.

"కాశ్మీరు విముక్తి ఉద్యమాన్ని శాంతిభద్రతలకు భంగకరంగా విజృంభించనీయము. కాని భారతదేశం ఆక్రమించిన కాశ్మీరులో రాజకీయపరిస్థితి చాలా విషమించినదని తెలుస్తున్నది. భారతసేనలను తూర్పుపాకిస్తాన్ ఎల్లల్లో చేర్చుతున్నారని తెలుస్తున్నది కాని, నాకు గట్టిగా ఆవిషయం తెలియదు" అని శ్రీ చౌదరి చెప్పారు.

రెండు దేశాలమధ్య ఎల్లల పరిశీలన నిర్ణయాలు ఏప్రిల్ 11 న ప్రారంభమవుతాయనికూడా చెప్పారు.

### ఉద్యోగ వార్తలు

కర్నూలు, ఏప్రిల్ 9.

జిల్లా మేజస్ట్రేటు (న్యాయశాఖ) శ్రీ ఆర్. వి. శీతారామారావు (గుత్తి) ఆ పదవి రద్దుతో కర్నూలు జిల్లా అదనపు జిల్లా సెషన్సు జడ్జిగా (నంద్యాల) నియమితులైనారు.

జిల్లా మేజస్ట్రేటు (నంద్యాల) శ్రీ పి. శివరావు ఆ పదవి రద్దుతో నెల్లూరు అదనపు జిల్లా సెషన్సు జడ్జిగా నియమితులైనారు.

చిత్తూరుజిల్లా న్యాయశాఖ జిల్లా మేజస్ట్రేటు ఆపదవి రద్దుతో చిత్తూరు అదనపుజిల్లా సెషన్సు జడ్జిగా నియమితులైనారు.

కడప జిల్లా న్యాయశాఖ మేజస్ట్రేటు కె. సుబ్రహ్మణ్యంచౌదరి ఆ పదవి రద్దుతో కడప అదనపు జిల్లా సెషన్సు జడ్జిగా నియమితులైనారు.

శ్రీకాకుళం న్యాయశాఖ జిల్లా మేజస్ట్రేటు ఆ పదవి రద్దుతో శ్రీకాకుళం అదనపుజిల్లా సెషన్సు జడ్జిగా నియమితులైనారు.

నెల్లూరుజిల్లా న్యాయశాఖ మేజస్ట్రేటు శ్రీ కె. అబ్దుల్ రహ్మన్‌ఖాన్, విశాఖపట్నంజిల్లా న్యాయశాఖ మేజస్ట్రేటు శ్రీ వి. డి. వి. శర్మ న్యాయశాఖ మేజస్ట్రేటు పదవుల రద్దులో సబ్ జడ్జీలుగా ఏప్రిల్ 1 నుంచీ మార్చబడినారు.

ఆంధ్రవ్యవసాయసర్వీసులో శ్రీ ఎం. సోమయ్య, శ్రీ ఎం జీవనరావు గారలు ప్రాంతీయ ఉప డైరక్టర్లుగా నియమితులయ్యారు. మాచ్‌ఖండ్ జలవిద్యుత్ ప్రణాళిక డివిజనల్ ఇంజనీరుగా గత నవంబరు నుంచి మరో ఏడాది టి. ఇ. మార్టిన్ తిరిగి నియమించబడ్డారు.

ప॥ గో॥ అడిషనల్ జిల్లా సెషన్సు జడ్జి శ్రీ టి కృష్ణస్వామి ఏప్రిల్ 2 నుంచి మళ్లీ ఆ పదవిలో నియమితులైనారు. కర్నూలు జిల్లాజడ్జి శ్రీ కె. జగన్నాథరావు సెలవునుంచి వచ్చిన తర్వాత శ్రీ పి. శివరావు చౌదరి గారు రావడంతోనే గుత్తి కార్యస్థానంగా అనంతపురంజిల్లా అదనపుజిల్లా సెషన్సు జడ్జిగా నియమితులైనారు.

## ఫ్యాక్టరీకి సప్లయి చేసిన చెరుకుకు పైకం ఇవ్వండి

### తుమ్మపాల రైతుల విజ్ఞప్తి

అనకాపల్లి, ఏప్రిల్ 6: రైతులు సప్లయి చెరుకుకు వీలైనంత త్వరగా డబ్బు చెల్లించమని పంచదార ఫ్యాక్టరీ యజమానులను కోరుతూ తుమ్మపాల చక్కెర ఫ్యాక్టరీ ఫిర్కా చెరకు ఉత్పత్తిదారుల సంఘ సమావేశంలో తీర్మానించారు.

సమావేశానికి శ్రీ కె. గోవిందరావు అధ్యక్షత వహించారు. శ్రీ పి. వి. రమణ ప్రసంగించారు.

తుమ్మపాల చక్కెర ఫ్యాక్టరీకి చెరకు సప్లయిచేసే బర్మా రాకపోకలకు వీలుగా రోడ్లను మరమ్మతు చేయించమని అభ్యర్థించారు. రైతులకు ఫ్యాక్టరీ యజమానులు ఇచ్చే బకాయీలు నెలనెల్లు మించి వడ్డీ విధనపోయించవద్దని కోరుతూ తీర్మానం చేశారు.

హాంకాంగ్, ఏప్రిల్ 8: శ్రీ యువాన్ చంగ్ షీన్ చైనా ఉప విదేశాంగ మంత్రిగా నియమితులైనారని న్యూచైనా వార్తా సంస్థ చెప్పడించింది

(జనరల్ యువాన్ చంగ్ షీన్ భారతదేశంలో చైనా రాయబారిగా ఉన్నారు.

## తిరుపతి మహిళా కళాశాల

### అభివృద్ధి చేయాలని నిర్ణయం

తిరుపతి, ఏప్రిల్ 6: ఇప్పుడు ఇక్కడ ఉంటున్న శ్రీ పద్మావతి మహిళా కళాశాలను మొదటి తరగతి కళాశాలగా అభివృద్ధి చేయ తిరుపతి దేవస్థానం నిర్ణయించి అవసరమైన అనుమతి ఇవ్వవలని శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి దరఖాస్తు చేశారు. విశ్వవిద్యాలయం నియమించిన ప్రత్యేక సంఘం మొన్న కళాశాలను తనిఖీ చేశారు.

రాయలసీమలోకల్లా ఇదొక్కటే మహిళా కళాశాల. తిరుపతి దేవస్థానం నాలుగు సంవత్సరాల కిందట దీనిని విద్యార్థినులకు ఏర్పాటు చేశారు.

సంఖ్య పెరిగి పోతున్నది. వచ్చే సంవత్సరంనుంచి ఇంటర్మీడియెట్ తరగతిని తీసివేసి 3 సంవత్సరాల "డిగ్రీ కోర్సు" పద్ధతిని అమలు చేయనున్నారు కనుక విద్యార్థినుల వసతి గృహంతో యీ కళాశాలకు క్రొత్త భవనం కట్టించాలని దేవస్థానం నిర్ణయించారు. భవనాల నిర్మాణంకూడా ప్రారంభమైంది.

## భద్రాచలంలో శ్రీరామనవమి సన్నాహాలు

కొత్తగూడెం, ఏప్రిల్ 4: భద్రాచలంలో శ్రీరామనవమి ఉత్సవాలను హైదరాబాద్ ప్రభుత్వం సన్నాహాలు చేయించడమనేది శతాబ్దాలుగ వస్తున్న ఆచారం. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ త్వరలో జరుగుతుంది కనుక 'ఆంధ్ర - తెలంగాణా' ఏర్పడే క్రొత్తప్రభుత్వం ఆధ్వర్యాన వచ్చే యేడు భద్రాచల శ్రీరామనవమి ఉత్సవాలలో నూతనాధ్యాయం ప్రారంభం కాగలదు,

ఈ యేడు ఏప్రిల్ 19 న శ్రీరామనవమి హైదరాబాద్ రాష్ట్ర ప్రభుత్వం మామూలుగానే ఈ సంవత్సరంకూడా ఉత్సవాలకు విపుల సన్నాహాలు చేస్తున్నారు. కొత్తగూడెం, గుమ్మురఘట్‌లలో పెద్ద పెద్ద పందిళ్లు వేయిస్తున్నారు. యాత్రికుల సౌకర్యార్థం ప్రత్యేక రైళ్లు, బస్సులను నడిపిస్తారు. మశూచి వంటి అంటువ్యాధు లున్నవి కనుక

## శ్రీ అనంతకృష్ణ శర్మకు సన్మానం

### తిరుత్తని పాఠశాల సారస్వత సమాజంచే

తిరుత్తని, ఏప్రిల్ 6: తిరుత్తని బోర్డు ఉన్నత పాఠశాల ఆంధ్ర సారస్వత సమాజం వార్షికోత్సవం శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ అధ్యక్షతన నిన్న జరిగింది. సభికులకు పండితబూదూరు రామానుజులు రెడ్డి స్వాగతం చెప్పారు. పూర్వగాథలనుంచి తాము అనువదించిన పద్యాలను, తాము సంస్కరించుకున్న అన్నమాచార్యుల కృతులను శ్రీ అనంతకృష్ణశర్మ గానంచేశారు. శ్రీ శంకరంబాడి సుందరాచారి ప్రసంగించిన తరువాత సారస్వత సంఘ కార్యదర్శి శ్రీ జి. మునిరత్నం వార్షిక నివేదిక చదివారు శ్రీ అనంతకృష్ణశర్మకు సారస్వత సమాజం తరఫున ఫలపుష్ప చందన తాంబూలములతో స్వర్ణతాంబూలీయకము, శ్రీ సుందరాచారికి నూతన వస్త్రాలు,ఖగోళజ్యోతిష శాస్త్ర పండితుడు శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులకు ఫలపుష్ప చందన తాంబూలాలను శ్రీ ఎస్ కృష్ణమనాయుడు సమర్పించి సత్కరించారు. వక్తృత్వ పోటీలలో గెలుపొందిన విద్యార్థులకు సభాధ్యక్షుడు బహుమతులను ఇచ్చారు. ఇటువంటి సభల అవసరాన్ని వివరించుచూ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ ఎస్. వెంగయ్యనాయుడు ప్రసంగించారు. శ్రీ కృష్ణమనాయుడు వందనసమర్పణ చేశారు.

### కాశ్మీరు యాత్రికులను విమాన సౌకర్యాలు

ఈ వేసవిలో కాశ్మీరు వెళ్లే యాత్రికుల సౌకర్యాలకోసం భారత విమానయానసంస్థ ఢిల్లీనుంచి అదనపు విమానాలు నడపడానికి ఏర్పాటు చేస్తోంది.

నిరోధక మందు తీసుకున్నట్టు ధృవపత్రాలను చూపిస్తేనే యాత్రికులను బస్సు ప్రయాణం చేసే వీలుండదు. భారత ఉపరాష్ట్రపతి డాక్టరు ఎస్. రాధాకృష్ణన్ను, రైల్వేశాఖ మంత్రి శ్రీ లాల్ బహద్దూర్ శాస్త్రిని కూడా ఉత్సవాలకు దేవాలయ పాలకవర్గం ఆహ్వానించారు.












## గంటల పంచాంగం

శ్రీ మన్మథ సం॥ ఫాల్గున బ॥ చతుర్దశి 1956- సం॥ ఏప్రిల్ 10 మంగళవారం మం॥ చతుర్దశి 9.7 ఉ భా 12-5 వర్జ్యం 28-13 ల రా 1-27 కు.
బ॥ అమా ఏప్రిల్ 11 బుధవారం బు॥ అమా 8-6 శత 11-41 వర్జ్యం లేదు.


ఆంధ్రపత్రిక

ఒరు లేయని యొనరించిన
పరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్
(మహాభారతము)

శ్రీ మన్మథ సం॥ ఫాల్గున బ॥ చతుర్దశి
మంగళవారం


## భూసంస్కరణలు

దేశాభ్యుదయానికి పరిశ్రమలు ముఖ్యాధారాలు కాబట్టి, ఏ అభివృద్ధి ప్రణాళికలో నైనా వాటికి సముచితమైన స్థానాన్ని ఇవ్వకతప్పదు. కనుకనే మొదటి పంచవర్ష ప్రణాళికలో కంటె ద్వితీయ ప్రణాళికలో చిన్న పెద్ద పరిశ్రమల అభివృద్ధికి కేంద్ర ప్రభుత్వం, ప్రణాళికా రచనాసంఘం కూడా విశేష ప్రాధాన్యాన్ని ఇవ్వడం జరిగింది. మనదేశానికి సంబంధించి ఇంతవరకు అన్ని పరిశ్రమలలోకీ అతిప్రధానమైన, అనాదిసిద్ధమైన పరిశ్రమ వ్యవసాయమే. దేశ ఆర్థిక వ్యవస్థకు వెన్నెముక మాదిరిగా వున్న వ్యవసాయాన్ని క్రమబద్ధం, శాస్త్రబద్ధం చేస్తేనేగాని, ఇతర రంగాల పారిశ్రామికంగా సాధించే అభివృద్ధికీ, కోట్లకొలది గ్రామాలలో వున్న కర్షక జనాభ్యుదయానికీ పొంతనం కుదరదు. అందుచేత, మిగతా పరిశ్రమలలో జరిగే అభివృద్ధిఅంతా ఒకఎత్తు; వ్యవసాయాభివృద్ధికి జరిగే కృషి ఒక్కటీ ఒకఎత్తూ అవుతున్నది.

భూస్వామ్య విధానంలో అవసరమైన సంస్కరణలు జరగనిదే, వ్యవసాయాభివృద్ధికి సంకల్పించే కార్యక్రమ మేదీ సత్ఫలితాలు ఇవ్వలేదనే చెప్ప వచ్చు. తొలిపంచవర్ష ప్రణాళిక కాలంలో వివిధ రాష్ట్రాలలో జమీందారీలను, జాగీర్దారీలను రద్దుచేయడం జరిగింది. రైత్వారీ విధానాన్ని అమలు చేశారు. కొన్ని ప్రాంతాలకు కౌలుదారీ రక్షణ శాసనాలను వర్తింపజేశారు.

భూస్వామ్య విధాన సంస్కరణకు సంబంధించి సంతవరకు ఒక్కొక్క కుటుంబానికీ వుండ వలసిన గరిష్ఠ కనిష్ఠ, భూవసతి ప్రమాణాన్ని నిర్ణయించడం అతి ప్రధానమైన విషయం; ప్రమాణాన్ని నిర్ణయించిన తర్వాత లభ్యమయ్యే భూమిని పంపిణీ చేయవలసివున్నది మరీ ప్రధానమైన సమస్య, ఆర్థికంగా గిట్టుబాటుకాని చిన్న కమతాల ఏకీకరణ అన్నిటికంటే ముఖ్యమైన, అతి జటిలమైన మరొక సమస్య. ఈ విధంగా అనేక సమస్యలను ప్రజాశ్రేయస్సుదృష్ట్యా సమన్వయం చేసుకుపోతేనేగాని దేశవ్యాప్తంగా కొనసాగవలసిన భూసంస్కరణల తతంగమంతా సంతృప్తికరంగా పూర్తికాదు. ద్వితీయప్రణాళిక వ్యవధిలో ఈ కార్యక్రమం పూర్తికావాలని కేంద్ర ప్రభుత్వం, ప్రణాళికా సంఘం సంకల్పించి వ్యవహరిస్తున్నవి. రాష్ట్రానికీ రాష్ట్రానికే మధ్యేగాక జిల్లాకు జిల్లాకూ మధ్యగూడా భూసారం, ఫలసాయం, సీటివసరులు మొదలైన విషయాలలో అనేక తారతమ్యాలు వుండడం సహజం. ఈ తరతమ భేదాలన్నిటినీ పాటించి హైదరాబాద్ ప్రభుత్వము భూసంస్కరణల అమలుకు ఇప్పటికే కొన్ని ముఖ్యమైన శాసనాలను అమలుపరిచి ముందంజ వేసింది.

దేశం మొత్తంమీద ఇంత త్వరగా భూసంస్కరణ శాసనాలను తయారుచేసి అమలు జరుపుతున్న రాష్ట్రం హైదరాబాదే తప్ప మరొకటి లేదు. అందుచేత కేంద్ర ప్రణాళికా రచనాసంఘం హైదరాబాద్ శాసనాలనే ఇతర రాష్ట్రాలు కూడా నమూనాలుగా భావించవచ్చునని, ఆపద్ధతులనే ప్రాంతీయావసరాలకు అనుగుణమైన స్వల్ప మార్పులతో పాటించవచ్చుననీ అభిప్రాయ పడుతున్నది.

వచ్చే అక్టోబరునాటికి ఆంధ్ర తెలంగాణాల విలీనం జరిగి తెలుగు ప్రాంత మంతా ఏక రాష్ట్రంగా ఏర్పడబోతున్నది. కాబట్టి, భూసంస్కరణల విషయంలో ద్వంద్వ విధాన ప్రమాదం లేకుండా వుండాలంటే ఇప్పటి ఆదర్శ ప్రాయమైన హైదరాబాద్ శాసనాలనే రాష్ట్రమంతటికి వర్తింప చేయడం ఉత్తమం.

హైదరాబాద్ భూసంస్కరణల సంఘాధ్యక్షుడుగా పని చేసిన శ్రీ మందుముల నరసింగరావు ఇచ్చిన సలహాను ఆంధ్ర ప్రభుత్వం పాటిస్తుందనే ఆశించవచ్చు. ఆంధ్ర ముఖ్యమంత్రి అక్టోబరులోపుగా భూసంస్కరణల అమలు సాధ్యపడదని శాసనసభలో ప్రకటించడంలో ఉద్దేశంకూడా ఇదే అయివుండవచ్చు.

భూసంస్కరణల అమలుకు కొన్ని నెలల విలంబనం జరిగితే జరగవచ్చుగాని, తాము నియమించిన వ్యవసాయ సంస్కరణల సంఘం నివేదికను ఇప్పటికీ ఆంధ్రప్రభుత్వం ఎందుకు ప్రకటించదో బోధపడదు. ఆ నివేదికలో పరిశీలకసంఘంవారు ఏయే సిఫార్సులు చేశారో తెలుసుకునే హక్కు ప్రజలకు వున్నదనే విషయాన్ని ప్రభుత్వం గమనించాలి.

## ఆల్జీరియాలో ఫ్రెంచి దౌర్జన్యం

### బ్రిటనుకు లిబియా విజ్ఞప్తి

ట్రిపోలీ, ఏప్రిల్ 8: ఆల్జీరియాలో ఫ్రెంచి సైన్యం సాగిస్తున్న హింసాకాండను అరికట్టేందుకు జోక్యం కలిగించుకోవలసిందిగా బ్రిటనుకు లిబియా ప్రధాని శ్రీ ముస్తఫా బిన్ హలీం విన్నవిజ్ఞప్తి చేశారు. సెలవుమీద స్వదేశానికి వెడుతున్న బ్రిటిష్ రాయబారి ద్వారా ఈయన ఈ సూచన పంపారు.

లిబియా రాజు ఇద్రిస్ గురువారం నాడు అమెరికా రాయబారికి ఇటువంటి విజ్ఞప్తినే చేశారు.

### ఆల్జీరియాలో పోరాటాలు

అల్జీర్, ఏప్రిల్ 8: ఆల్జీరియాలో నెమెంచా కొండ ప్రాంతంలో ఫ్రెంచి సేనలు జాతీయవాది సమూహాలు రెండింటిని చుట్టుముట్టేందుకు ప్రయత్నిస్తున్నవి. మొరాకో సరిహద్దుల దగ్గర, ఓరాన్ ప్రాంతంలో ఫ్రెంచి సేనలు విమానాల తోడ్పాటుతో 300 మంది జాతీయవాదులతో పోరాడుతున్నవి.

కొత్తగా అల్జీరియాలో జరుగుతున్న పోరాటాల్లో గత 24 గంటలలోనూ 112 మంది ఉభయపక్షాలలోనూ మరణించారనీ, రెండు ఫ్రెంచి "హెలికాప్టర్" విమానాలకు జాతీయ వాదులు మూల్చివేశారనీ వార్తలు వచ్చినవి.

## సింహళ ఎన్నికలు

### 65 స్థానాల్లో 42 ఏకసత్తపార్టీకి

కొలంబో, ఏప్రిల్ 8: సింహళ పార్లమెంటుకు నిన్న జరిగిన రెండో రోజు పోలింగులో ప్రధాని కొతేలవల పక్షం ఒక్క స్థానాన్నికూడా గెలవ లేకపోయింది. నిన్న 28 స్థానాలకు పోలింగు జరిగింది. 5వ తేదీ, 7వ తేదీలలో ఎన్నికలు జరిగిన మొత్తం 65 స్థానాల్లోనూ మహాజన ఏకసత్త పెరమూనా (యునైటెడ్ ఫ్రంట్) 42 స్థానాలు సంపాదించింది.

ప్రభుత్వపక్షానికి 8, సమలంకా సమసమాజ్ పార్టీకి 11, కమ్యూనిస్టులకు 2, స్వతంత్రులకు 2 స్థానాలు వచ్చినవి.

పదవ తేదీన మిగిలిన 30 స్థానాలకు పోలింగ్ జరుగుతుంది. ఏకసత్త పార్టీ నాయకుడు శ్రీ బండారనాయక్, సమసమాజ్ నాయకుడు డా॥ పెరేరా, గృహనిర్మాణమంత్రి శ్రీ కొంతియ్య వైద్యనాథన్ ప్రభృతులు 16వ తేదీన పోటీచేస్తున్నారు. ప్రభుత్వపక్ష నాయకుడు శ్రీ కొతేలవల, కమ్యూనిస్టు నాయకుడు డా॥ విక్రమసింగ్ ఎన్నిక అయినారు.

### ఆసియాలో అమెరికాకు ముప్పు

న్యూయార్క్, ఏప్రిల్ 8: సింహళ ఎన్నికల్లో ప్రభుత్వపక్ష పరాజయం "స్వతంత్ర దేశాలకు అన్ని విధాలా పెద్ద దెబ్బ అని న్యూయార్క్ టైమ్స్ నేడు వ్యాఖ్యానించింది. కొతేలవల పార్టీ ఓటమికి కారణం పశ్చిమరాజ్య వ్యతిరేకత కాదనీ, ఆ పార్టీకి దీర్ఘకాలం అధికారంలో ఉన్నందువల్ల కళ్లు నెత్తికి రావటమేననీ ఆ పత్రిక సమాధానం చెప్పుకున్నది.

"ఆసియాలో సోవియట్ కూటమితో జరుగుతున్న ప్రచ్ఛన్న యుద్ధంలో అమెరికా ఓడిపోయిందనటం అతిశయోక్తి. అయితే మనం మన పదవిని నిలుపుకో గలుగుతున్నామనీ, గెలగలమనికానీ చెప్పేందుకు అవకాశాలు లేవు. భారత ప్రధాని ఉద్దేశాలు, భారత ప్రజల ఉద్దేశాలుచూస్తే, అమెరికాకు మంచి రోజులుగా కనిపించటంలేదు. ఆసియాలో భారతదేశం అమెరికాకు ప్రమాదకరమయిన ప్రాంతం అని అంతా గమనించాలి" అని అమెరికన్ గొలుసుకట్టు పత్రికల ప్రధాన సంపాదకుడు శ్రీ హార్స్ట్ నేడు న్యూయార్క్‌లో ప్రకటించారు.

ఈయన ఇటీవలనే కొందరు విలేఖరులతో కలిసి పది ఆసియాదేశాల్లో పర్యటించి తిరిగి వచ్చారు.

## కాంబోడియాపై అమెరికా ఒత్తిడి

### ఉత్తర వియత్నాం ఆరోపణ

హాంకాంగ్, ఏప్రిల్ 8: కాంబోడియాను మనీలామండలిలో చేర్పించాలనే ఉద్దేశంతో ఇరుగు పొరుగు దేశాలయిన దక్షిణ వియత్నాం, థాయ్‌లాండ్‌లచేత అమెరికా ఒత్తిడి పెట్టిస్తున్నదని ఉత్తర వియత్నాం వార్తా సంస్థ ఆరోపించింది. కాంబోడియా ప్రధాని సరోదం రాజీనామాకు ఇదే కారణమని హనోయ్ రేడియో ప్రకటించింది.

(సరోదం ఈ ఒత్తిడిని గురించి బహిరంగంగా విమర్శించి ఉన్నారు.)

"కేవలం మనీలామండలి సహాయం అక్కరలేదనీ, తటస్థంగా ఉంటామనీ కాంబోడియా ప్రభుత్వం చేసిన ప్రకటన అమెరికా ప్రభుత్వానికి పిడుగుపాటువలె తోచింది. శ్రీ సరోదంమీద అనేకవిధాల ఒత్తిడి తీసుకుని రావటమే కాక థాయ్‌లాండ్, దక్షిణ వియత్నాంలచేత సరిహద్దుదాడులు అమెరికా జరిపించింది. ఆ తరవాత ఆ వెలుపల దేశాలకు రావటం, అప్పుడు కాంబోడియామీద దిగ్బంధనం ప్రయోగించటం, ఆ పిమ్మట కాంబోడియాలో కొంపాంగ్‌సోం రేవుకు రోడ్డు నిర్మాణానికి చేస్తాన్న సహాయాన్ని అమెరికా నిరాకరించటం జరిగింది.

ఈ చర్యలవల్ల కాంబోడియాలో ఆర్థిక సంక్షోభం వచ్చి, ప్రధాని సరోదం రాజీనామా ఇచ్చారు. దీనిమీద దేశ మంతటా ప్రజలు ఆయనే ప్రధానిగా ఉండాలనీ, దేశం తటస్థ విధానాన్నే అనుసరించాలనీ ప్రదర్శనలు జరిపి ఉన్నారు." అని వియత్నాం రేడియో వివరించింది.

### హానన్-గ్రోమికో సంప్రదింపులు

వియత్నాం ఏకీకరణ సమస్యను గురించి భారత మంత్రివర్గసభ్యుడు శ్రీ వి. కె. కృష్ణమీనన్ త్వరలో లండన్‌లో సోవియట్ ఉపప్రధాని శ్రీ గ్రోమికోతో సంప్రదిస్తారు. జెనీవాఒప్పందం అమలుకు (వియత్నాం ఏకీకరణ ఇందులో ఒక అంశం) లీసుకోవలసిన చర్యలు బ్రిటన్, సోవియట్ ప్రతినిధుల మధ్య వారంనుంచి సమాలోచన జరుగుతున్నదని తెలుస్తున్నది. శ్రీ మీనన్‌కూడా ఇందులో పాల్గొనవచ్చునని తెలుస్తున్నది.

# సంఘం: శాస్త్రం

[శ్రీ పావులూరి శివనారాయణ]

మానవుని కృషి మానసిక తేజస్సును, భౌతిక సౌఖ్యమును పెంపొందచేస్తుంది. మానసిక తేజస్సునే విజ్ఞానమంటున్నాము. విజ్ఞానము వివేకమును అభివృద్ధి చేస్తుంది. వివేకము మానవుని భోగలాలసర్వములో తన్మయుడై, కర్తవ్య పరాఙ్ముఖుడై, ప్రమత్తుడై ప్రవర్తించు ప్రమాదమునుండి పరిరక్షిస్తుంది. అంటే భౌతిక భోగములకు ఉపాధుల నేర్పరచుకొని, జీవితములో పురోగమించుటలోనే మానవుని విజ్ఞానము, వివేకము వ్యక్తమవుతాయని దీనిని బట్టి తెలుస్తుంది. జీవితములో పురోగమించుటలోనే వ్యక్తిత్వవికసితి, ఆదర్శజీవనము, ఆనందము అనేవి అర్థమవుతాయి. ఈత్రయము సంఘము, సంఘాదర్శములను గూర్చిన ఆలోచనకు దారితీస్తాయి. సంఘాదర్శములు సిద్ధించినప్పుడే, ఆదర్శ సంఘ మంటున్నాము.

విజ్ఞాన మభివృద్ధి గాంచిన ఆధునిక యుగమును వైజ్ఞానిక యుగమనీ, వైమానిక యుగమనీ, పరమాణు యుగమనీ, యాంత్రిక యుగమనీ వేర్వేరు విధములుగా పిలుచుట పరిపాటియైనది. విజ్ఞానాభివృద్ధి స్వయం శక్త్యుత్పాదకములైన నూతన యంత్ర నిర్మాణమునకు దారితీసినది. పరిశోధనా ఫలితముగా సాధింపబడిన విషయములు ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగములలో అనేక నూతన సమస్యలను ఉత్పన్నము చేసినాయి. ఈ సమస్యలన్నీ పరస్పరాశ్రయములై వర్ధిల్లి ఆయా రంగములలో నూతన సిద్ధాంత సృష్టికి దారితీస్తున్నాయి. సిద్ధాంత ప్రపలు భావప్రపంచములో విహరిస్తూ విజ్ఞాన వాదములు పొంగిపొరలు గతించినాయని పరమాణు యుగములో పరిణామవాదము చాటుతుంది. నాగరికతాభివృద్ధితోపాటు తినేతిండిలోను, నివాస స్థావరములలోను, వేసే వేషములలోను, మాట్లాడే భాషలలోను, భావప్రకటనలోను, ఆచార వ్యవహారములలోనూ, విహార విధానములలోను, ఆలోచనలలోను అనివార్యమైన మార్పులు వచ్చాయి. మానవుడు ఆలోచనాశీలుడనుట అక్షరాలా నిజమైనది. ప్రపంచములోని ఆయా దేశములలో ఆయా కాలములందు జరిగిన చరిత్రాత్మక సంఘటనములను దృష్టిపథమున నిల్పియే విషయములను గూర్చి యోచించవలసిఉంది. అలా యోచించునప్పుడు నిష్పక్షపాతముగా విషయములను విమర్శించుకొను వ్యక్తి మాత్రమే త్రికరణ శుద్ధిగా వ్యవహరించగలడు. అప్పుడే శాంతియుత సహజీవనము నలవడ జేసుకొని ప్రపంచ ప్రగతి, వసుధైక కుటుంబము, మానవాభ్యున్నతిని సాధించుకొనుటకు మానవుడు త్రికరణ శుద్ధిగా కృషి చేయగలడు. అప్పుడే మానవ సంఘ ముఖ్యోద్దేశము నెరవేరుతుంది.

### 2

జీవనిర్జీవ పదార్థములతో ఉనికిపట్టై విలసిల్లుచున్న ప్రకృతిలో ప్రతిష్ఠింపబడిన మానవుడు సృష్టిలోని జీవులన్నిటికంటె ఉత్కృష్టుడని విశ్వసించి కృషి సల్పుచున్నాడు. మానవుని కృషి విజ్ఞానమును ముందుకు గొనిపోతుంది. విజ్ఞానాభివృద్ధికూడ కృషియందు శ్రద్ధను ఇనుమడింప చేస్తుంది. విజ్ఞాన తృష్ణా పరతంత్రుడైన మానవుడు అనేక ప్రకృతి రహస్యములను అరయ గలిగినాడు. తత్ఫలితముగా జీవనపరిమాణమభివృద్ధి పరచుకొని జీవన సౌలభ్యమును, సౌఖ్యమును సమకూర్చుకున్నాడు. మలిజీవనము చేరయుటకలవాటుపడిన మానవుడు ప్రళయోద్దండమును మారణోద్యోగోత్పత్తిని గాంచి భీతచిత్తుడై ఉన్నతాదర్శముల వైపునకు మనస్సును మరల్పక తప్పినదికాదు. తత్ఫలితముగా ప్రపంచ ప్రజలు ప్రపంచాభ్యుదయ సాధనోద్యమములో సభ్యులము గావలెనని ఆకాంక్షిస్తున్నారు. విజ్ఞానశాస్త్రముల సహాయమున సత్యాన్వేషణాపరతంత్రులగు శాస్త్రజ్ఞులు విజ్ఞాన ప్రపూర్ణులై సల్పిన కృషి ఫలితముగా కలిగింపబడిన విజ్ఞానజ్యోతి అనతిక్రమములు దాపరిగిన దేశకాలములనుకొంతవరకు మానవుని ఎత్తుకుమింప కలడను విలువకాటును జూపినది. తత్ఫలితముగా ప్రపంచము చిన్నదైనది. సుదీర్ఘకాలము కృషిసల్పినగాని సిద్ధించని విషయములెన్నో అనతికాల మొనర్చిన కృషి ఫలితముగా నేడు మానవునకు వశమౌతున్నాయి.

నేడు దూరమును గంటలలో కొలుచుట శాస్త్రజ్ఞులకు సహజదోరణిగా మారినది. తత్ఫలితముగా త్రిపరిమాణాత్మక విశ్వము చతుష్పరిమాణాత్మకమై, సౌందర్య విలసితమై, శక్తి స్వరూపిణిగా గోచరిస్తుంది. వివిధ విజ్ఞానశాస్త్రముల సహాయమున మానవునకు వశమైన ప్రకృతి శక్తులు సమీకరింపబడి, పరమాణుబాంబు, ఉదజనిబాంబు, కోబాల్టుబాంబు మున్నగు రూపములలో మానవునకు వశపడి, భయము, ద్వేషము, క్రోధము, అవిశ్వాసము ప్రబలి పరస్పర వైరమును పెంచుట ఫలితముగా మానవుని ప్రపంచ మారణమునకు పురికొల్పుతున్నాయి. సర్వజన శ్రేయస్సు నాకాంక్షించి, సర్వజనాభ్యుదయమును సాధించుచే పరమ ధ్యేయముగా కల విజ్ఞానవేత్తలు, మహామేధావులు, ప్రతిభావంతులునగు శాస్త్రజ్ఞుల చేకను గొనబడిన అంశములు, అవిశ్వాసము, స్వార్థము, క్రోధము, భయములచే నిరంతరము ... రాజకీయజ్ఞులగు నాయకుల చే దుష్ప్రయోగము జరుగుతున్నాయి తత్ఫలితము నేడు ప్రపంచమునందు ఆవరించియున్న అశాంతి వాతావరణము, యుద్ధభీతి. ఇట్టి దుష్ప్రయోగమునుండి రాజకీయ నాయకులను శాస్త్రజ్ఞులు మరల్పవలెనన్న ఎరుగుట మానవాళి దురదృష్టమనక తప్పదు.

### 3

స్వార్థము, ద్వేషము, క్రోధము, భయము, అవిశ్వాసము అనేవి మానవుడున్నంత వరకు కొద్దొగొప్పో ఉంటూనే ఉంటాయి. నిష్పాక్షిక దృష్టి గూటికి నూరుపాళ్లు మానవుడలవరచుకొనగలిగినప్పుడు మాత్రమే నిస్స్వార్థ చింతన, పవిత్ర ప్రేమ, నిర్భయత్వము, విశ్వాసము మానవుని కలవతాలేయి. కొబట్టినిష్పాక్షికదృష్టిని సాధ్యమైనంత ఎక్కువ వసాయికి పెంచుకొనుటే మానవునకు ధ్యేయముగావాల్సి ఉంది. ప్రపంచములో నేటివరకు పుట్టి, పెరిగి గిట్టినవారిలో నెప్పుడూ ఏదేశములోనూ నాటికి నూరుపాళ్లు నిష్పాక్షిక దృష్టి కలవారు ఉన్నటు చరిత్ర చెప్పుట లేదు. అట్టి వ్యక్తులను గూర్చిన భావనలు ఆదర్శమూర్తి రూపొందింపబడి, ఆదర్శసిద్ధికై కృషిచేయు మానవున కొత్తసిద్ధిని సమకూర్చినటి ఆదిశక్తియని విశ్వసింపబడి దైవమని నామకరణము చేయబడినది. మనుకొరము మానవుని మృత్యువాత పడద్రోస్తుంది. 'మమ' అను రెండక్షరములే మృత్యువు. 'నమమ' అను మూడక్షరములే బ్రహ్మపదార్థము.

ఇట్టి బ్రహ్మపదార్థము నాశ్రయించి మానవుడు మముకొర దూరుడు గాగలనని విశ్వసించినాడు. తద్విశ్వాస ఫలితముగా మానవునిలో కేక త్రిత జిజ్ఞాస, ఆపేక్ష మతముల నావిర్భవింప చేసినాయి. ఈమతములన్నీ బ్రహ్మమును గూర్చి సచ్చిదానందమనీ, సగుణమనీ, నిరామయమనీ, నిర్గుణమనీ, నిర్వికారమనీ వేర్వేరు విధములుగా సిద్ధాంతీకరించినాయి. ఆది మధ్యాంతరహితమును, నవ్యక్తసంజ్ఞకమును, శాశ్వతమునగు దేవుడు సృష్టిస్థితి లయములకు కారణభూతుడై మూర్తిత్రయముగా మారి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులని నామకరణము చేయబడినది. సర్వమతములకు అవలంబమై విలసిల్లిన 'బ్రహ్మము' మత సంఘర్షణకు కారణభూతమైనది. హిందూసామ్రాజ్యమున సుల్లేఖింపబడిన మూడుమతాల్నాద, విషయములు భిన్న సంఘములుగా మహా సంఘములో మేళవింపబడినప్పుడు ప్రధమమున సంభవింపగల సంఘర్షణమును, సాంఘిక వైపరీత్యమును సూచిస్తున్నాయి. మతిసామరస్యము, మతసమానము ప్రాతిపదికగా హైందవ తత్త్వమభివృద్ధి చెందినది. శ్రీరాముడు శివుని విలు విరచుట వైదిక శైవమతముల మధ్య సంఘర్షణమును వ్యక్తపరుస్తుంది. ఆర్యులకు దేవుడు విష్ణువు. ద్రావిడులకు దేవుడైన శివుడు దక్షిణామూర్తి నాబరగుచున్నాడు. ఆర్యేతరులకు దేవుడగు శ్రీకృష్ణుడు ఆర్య దేవతాధిపతియగు దేవేంద్రుని జయించినాడు. ద్రావిడుల విగ్రహారాధన విధానము ఆర్యులు అంగీకరించినారు. నిష్పాక్షిక దృష్టి నలవరచుకొను శక్తి మానవునకు సమకూర్చి, నైతికశక్తిని పెంపొందించి సంఘమును సుసంఘటిత పరచుచే సర్వ మతములకు పరమ ధ్యేయమని దీనిని బట్టి తేలుతుంది దేశకాలాను గుణముగా నాయామతి సిద్ధాంతములు ఋజువు చేయబడి ప్రజాదరణనొంది కొంతకాలము రాణించినవి. ఋజువు చేయుటలో నేరుహేతువులు కారణముగా చూపబడినపప్పుడు సమస్య జటిలమవుతుంది. ధర్మ సంస్థాపనము సర్వమత సమ్మతమైన విషయము. ఆయామతములు నాటి సంఘములో నైతిక ప్రబోధము ద్వారా ప్రబలింపచేసిన ధర్మము, ప్రవేశపెట్టిన సంస్కరణలు, దేశీయ సంస్కృతీ వికాసమున కెంతవరకు దోహదమొనర్చినాయను విషయమును మనమరయవలసి ఉంది. యుద్ధ రంగమున బడియున్న పీనుగుపెంటలను జూచిన పెంటనే హృదయమునందు కరుణరసము పెల్లివిరియ, జయము కరతలామలకమైనప్పుడు వీరాగ్రణియగు రాజానకు సహజముగా కలుగు సంరంభోత్సాహములను వీడి యహింసా వ్రతమును బూనిన అశోక చక్రవర్తి తన జీవితమును ఏ మతమున కంకిత మొనర్చి పరమత సహనమును గూర్చి ప్రబోధించినాడో యట్టి బౌద్ధమతము నొందిన సంస్కృతీ వికాసమును గూర్చి చెప్పునప్పుడు పడికట్టురాయిగా స్వీకరింప బడుతుంది. అంతమాత్రమున తక్కిన మతములన్నీ నిష్ప్రయోజనమైన వనుట సాహసము గాగలదు సంఘములో మంచిని, మానవతను నెలకొల్ప నిమిత్తము ఏర్పరుపబడిన వివిధ మతములు నల్లమందువలె పనిచేసి, శాస్త్రాభివృద్ధిని నిరోధించి, సంఘమునందు దురాచారములు ప్రబలుటకు హేతుభూతములైనాయి. తత్కారణముగా మతములు నిరసింపబడినాయి హేతువాదము ప్రబలిన నేడు జ్ఞానమే దైవము, సత్యమే దైవమని చిలువబడుతున్నది. సత్యమును గూర్చిన జిజ్ఞాస, జ్ఞానమును గూర్చిన మీమాంస మానవుని నిరంతరచింతనా మున్ముగా నొనర్చినాయి. సత్యమే జీవులకు పరమార్థమని హేతువాదము బోధిస్తుంది. దైవమునకు దాసుడై మానవుడు మలినంతకాలము వ్యక్తిత్వమును గోల్పోయి పరాధీనమన స్తత్త్వమును పెంపొందచేసుకొను ప్రమాదమున్నదని కొందరంటారు. బ్రహ్మజ్ఞానము మానవునిలో సర్వసమత్వమును పెంపొందింపచేయునని కొందరంటారు. ఆత్మవిశ్వాసమును పెంపొందించి, ఆత్మవికాసమును బొంది సేవావినుమదూల ముగా గోచరించునో అట్టి వాదమును మానవుడు తన మానసిక వికాసము, జీవితానుభవముల కనుగుణముగా ననుసరించి తరించుటే మానవ ధర్మమై యున్నది. తదితర వాదము లెట్టి సరియైనవికావని నిరసింపరాదు. నిరసన ఈర్ష్యాద్వేషములను ప్రేరేపిస్తుంది. ఈర్ష్యాద్వేషములు గలవ్యక్తి సంఘపతనము నొందును సంఘపతనము నుండి తప్పుకొని మానవత, సత్కృతులకు నిలయులై మనవలెనన్న అన్ని వాదముల రీతి నలను సహనబుద్ధి గలిగి యుండవలయును.

### 4

ఘర్షణకు దూరుడగుటలోనే మానవుని తెలివి తేటలు వ్యక్తమవుతాయి. బలముగలవానిదే రాజ్యముగా చెల్లుబాటైన దినములు కలవు. ధనికులరాజ్యము, నియంతృత్వ పరిపాలనముకొంతకాలము సాగినాయి. నాజీ ఫాసిస్టు సిద్ధాంతములు సంస్కృతి కవరోధముగా పరిగణింపబడి నిరోధింపబడినాయి. కమ్యూనిజము, సామ్యవాదము, ప్రజాస్వామ్యము మొదలగు వాదము లనేకము బయలుదేరి బహుముఖములుగా వ్యక్తికి విజ్ఞప్తి చేస్తున్నాయి. దానితో వ్యక్తి స్వాతంత్ర్యము, పురుషార్థములు మానవ సమాజమునకు లక్ష్యము లైనాయి. పురుషార్థములనగా ధర్మార్థ కామమోక్షములు. అందు ధర్మమునగా ఋజువర్తనము, అర్థమునగా ధనము, కామమనగా సుఖజీవనము, మోక్షమనగా జీవికి తన పరమార్థము సిద్ధించుట అని అర్థమవుతుంది. సుస్థిరముగాని సంఘ వ్యవస్థలో సంఘాదర్శములు లక్ష్యసాధనకు తోడ్పడలేవు. వ్యక్తిలో సమన్వయ శక్తి, సామరస్యభావము పెంపొంది నప్పుడే సంఘవ్యవస్థ సుస్థిరముగా గలదు. సామరస్యము, వ్యక్తి ప్రాముఖ్యము అను రెండు సూత్రములూ సంఘమునకు ప్రాణము వంటివని దీనిని బట్టి తేలుతుంది. సామరస్యమునే భద్రత అంటున్నాము. వ్యక్తి ప్రాముఖ్యమునకు ప్రత్యామ్నాయముగా 'ప్రేమ' ప్రతిపాదింపబడుతుంది. అయితే 'ప్రేమ' అనేది వ్యక్తికము. భద్రత సామూహికపదమై యున్నది. ఈ రెండు సూత్రముల మధ్యగల వైవిధ్యము ఇక్కడే వ్యక్తమవుతుంది. సంఘశ్రేయస్సును ఉపలక్షించు వ్యక్తి తన విధులను, లక్ష్యములను వివరించుకొని, సమన్వయశక్తిని, సహనశీలమును పెంపొంద చేసుకొనుట ద్వారా వ్యక్తిత్వమును పెంపొంద చేసుకోవాల్సి ఉంది. తననుగూర్చిన స్ఫురణతోపాటు సంఘమును గూర్చిన స్ఫురణ కలిగియుండాలి. ఇట్టి సామూహిక దృష్టి నలవరచుకొనుటకే నైతిక శాసనములను మానవుడేర్పరచుకొన్నాడు. ధర్మసూత్రములను నిర్వచించుకొన్నాడు.

పరిణామమే ధర్మము. పరిణామాత్మకము ప్రకృతిలో ప్రతిష్ఠింపబడిన మానవుడు పరిణామ మొందుచున్నాడు. అనగా ధర్మపరుడగుచున్నాడు. అనగా మానవునకొ శ్రేయమిచ్చి మానవత్వమును పెంపొంద చేయునది అవియే ధర్మమునకు అర్థము. 'ధర్' నుండి పుట్టినది ధర్మము. ధర్ అనగా పట్టుకొనుట అని వ్యుత్పత్త్యర్థము.

మానవ సమాజమే అన్ని వాదములకు భూమిక. మానవుడు కేంద్రము. తర్కశాస్త్రము, హేతువాదము మానవునిలో భావ విప్లవము గలిగించినాయి. తత్ఫలితముగా ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగములలో మానవుడు ఎన్నోరెట్లు ముందుకు వచ్చినాడు. అయినప్పటికి ఆయా రంగములలో అభ్యుదయము సాధింపబడలేదు. రాజకీయ సమత్వము, ఆర్థిక సౌభ్రాతృత్వములపై సంఘము ప్రతిష్ఠింపబడినప్పుడు ఆదర్శ సంఘము సిద్ధించ కలదని బోధపడినది. సంఘాభ్యుదయమును గూర్చి వివిధ రాజకీయ పక్షములు చేయు వాదోపవాదము లెట్టివి సమ్యగ్ములు కావు. ఆయా వ్యక్తుల ఆదర్శములు, ఆత్మ వికాసము వారొనర్చు వాదములు సాదర్శ ప్రాయమైనవిగా చేస్తాయి. ఈ విధముగా వ్యక్తి యొక్క ఆత్మోన్నత్యము నూతనగా కొని పెరిగినవాదము వ్యక్తితో నే కూలుట సంభవిస్తుంది. సిద్ధాంత బలముతోపాటు ఆచరణ యోగ్యత కలిగి, ప్రజాజీవితమును ధర్మ సంబద్ధమూ, నైతికమూ, వికాసవంతమూ జేయగలిగినప్పుడు మాత్రమే రాజకీయపార్టీ ప్రజాదరణ నొందకలదు. ఉత్తమ జీవిత విధానమును సాధించకల పార్టీకూడ అజ్ఞానము, అమాయకత్వములో మునిగియున్న సంఘములో ప్రజాదరణనొంది రాణించలేదు. సంఘ ప్రజలు అజ్ఞానము, అమాయకత్వములనుండి తరించినప్పుడే అట్టి పార్టీ ప్రాబల్యము నొందకలదు. అప్పుడే సంఘ శ్రేయస్సును ఉపలక్షించి కొనసాగింపబడు సమాజవికాస కార్యక్రమములు, జాతీయ విస్తరణ కార్యక్రమములు సమాజమును సర్వోదయ పద్ధతి వ్యవస్థా నిర్మాణోన్ముఖముగా పురోగింప చేస్తాయి. విద్య సంఘమునకు పెన్నెముక వంటిది. వ్యక్తి సౌజన్యమును పెంపొందచేసి సమత్వము, సౌభ్రాతృత్వము, స్వేచ్ఛలను గూర్చి నిగ్గుచు జ్ఞానమును బోధించగల మేముగా విద్యా విధానము నవరింపబడినప్పుడు మాత్రమే ఉత్తమ జీవిత విధానమును సాధించగల పార్టీ ప్రాబల్యమునొంది సంఘ వ్యవస్థను సరిదిద్దగలదు.

### 5

ఆధునిక యుగములో సాంకేతిక విజ్ఞానము, పారిశ్రామిక వికాసము సంఘముపై ప్రాబల్యము గలిగి ఉన్నాయి. సౌందర్య విలసితమగు ప్రకృతిలో ప్రతిష్ఠింపబడిన మానవుడు వినోద విలాసములను, సుఖసౌఖ్యములను, ఆనందమును, ఆహ్లాదమును అనుభవించుటకు సాంకేతిక విజ్ఞానము, పారిశ్రామికాభివృద్ధి విశేషావకాశములను గల్పిస్తున్నాయి. మానవుని కృషి విజ్ఞానమును ముందుకు గొనిపోతుంది. విజ్ఞానాభివృద్ధి కూడ మానవుని కృషికి తోడ్పడుతుంది. విజ్ఞానాభివృద్ధి మానవునిలో సృజనశక్తిని పెంపొందచేస్తుంది. వస్తూత్పత్తి విధానములో మార్పులను గలిగిస్తుంది. విజ్ఞానాభివృద్ధి ఫలితముగా భౌతిక శాస్త్రజ్ఞులూ, రసాయన శాస్త్రజ్ఞులూ పరస్పరము చేతులు కలిపి సాంకేతిక నిపుణుల సహాయముతో స్వయం శక్త్యుత్పాదకములైన నూతన యంత్రములను నిర్మిస్తున్నారు. ఆలోచనాశీలుడైన మానవుడు మానవ శ్రేయస్సును ఉపలక్షించి కొన్నివస్తువులను నిర్మిస్తున్నాడు. కొన్నివస్తువులను సృష్టిస్తున్నాడు. పంటలను పండించి ఆహార పదార్థములను తయారుచేస్తున్నాడు. నిప్పురవ్వను సృష్టిస్తున్నాడు. కాలముయొక్క మూల్యము అమూల్యమని గుర్తించి, ప్రతి నిమిషమునకూ విలువకట్టుతూ విజ్ఞానాన్వేషణా పరతంత్రులైన కొందరు మేధావులు, ప్రతిభావంతులు లోకశ్రేయస్సును ఉపలక్షించి సల్పిన అమోఘ కృషి, పొందిన అమూల్య ఫలితములు, కనుగొన్న సత్యములు వీటికి దోహద మొనర్చినాయి. అనేక శతాబ్దములుగా మానవుడు సల్పిన కృషి అనేక అపూర్వమైన అసామాన్య విషయములను సాధించి పెట్టినది. పూర్వకాలములో పశువుల సహాయముతో మానవుడు తన పనులను కొనసాగించుకొంటూ ఉండేవాడు. అంటే అది సజీవయంత్రముల యుగమన్న మాట. అప్పుడు అశ్వము, మానవుడు సజీవ యంత్రములుగా పని జేసినారు. ఆ స్థితిని జ్ఞాపకము జేస్తూ 'అశ్వశక్తి', 'మానవశక్తి' అను కొన్ని పదములు మాత్రమే నేడు మిగిలి ఉన్నాయి.

చలన యంత్రముయొక్క పనిజేయు శక్తిని 'అశ్వశక్తి' అని భౌతికశాస్త్రజ్ఞులంటారు. 'మానవశక్తి' అనగా నేటర్బైన్లను త్రిప్పు ప్రవాహశక్తిని గూర్చిన ఆలోచనలు ఇంజనీర్ల మనస్సుకు తట్టుతాయి.

విజ్ఞానశాస్త్రములు, సాంకేతిక విజ్ఞానము సజీవ యంత్రములకు బదులు నిర్జీవ యంత్రములను పనియందు ప్రవేశపెట్టినాయి. తత్ఫలితముగా కాలము, మానవశక్తి నిలువ చేయబడుతున్నాయి. పూర్వము మానవుడొక సంవత్సర కాలములో కాయకష్టము జేసి సాధించిన దానిని నేడొక వారము దినములలోనే జేయ గలుగుతున్నాడు. అదనముగా వశమైన కాలమును మానవుడు వినోద కాలక్షేపములందు, విలాస క్రీడలందు గడపుచు దుర్వ్యసనములకు గురియై మానవత్వమును గోల్పోవుచున్నాడు. శరీరశ్రమ చేయుట నాగరికతకు విరుద్ధమని భ్రాంతి చెందుతున్నాడు. దానితో కృషికి సరియైన విలువ కట్టలేకపోతున్నాడు. అధికారమును చెలాయించుటలోనే మానవుడు హోదా ననుభవింగలడను తాను దుస్థితికి దిగజారినాడు. దానితో అధికారతాపత్రయము ప్రబలి, పదవులు స్థిరమని భ్రమసి అధికార వ్యామోహము జలిసి, అధికార పీఠము నధిష్ఠించు నిమిత్తము; అజ్ఞానులను, అమాయకులను మనసున కింపుగలుగు మోజు మాటలాడి మోసము, వంచన జేస్తున్నారు. అపమార్గములను, నితర నిందాస్తుతులను ప్రయోజన కారులని తలంచి పదవులకై ప్రాకులాడుతున్నారు. విజ్ఞాన వికాసముల వర్ధిల్లిన సంఘములో తాను జేయగలిగింది ప్రజాసేవ మాత్రమేననీ, అధికార దుర్వినియోగము ద్వారా తాను అనుభవింపకలిగేది సాంఘిక పతనమనీ గుర్తించి తనకు హితమును, అనురూపమునకు కర్తవ్యమును మానవుడు తెలిసికొని అప్రమత్తుడై మెలగలేకున్నాడు. అలా మెలగ గలిగినప్పుడు వినోదకాలక్షేపములు, విలాస క్రీడల ననుసరించుటే నాగరికత అని భావింపడు. విలువైన దుస్తులు ధరించుటే నాగరికత అనీ, రైలులో ప్రయాణం చేయుట నాగరికత అనీ, రోజుకొక సినిమా చూచుట నాగరికత అనీ, అసలు సినిమా చూడని కర్షకుడు, రైలులో ప్రయాణము జేయని వ్యక్తి అనాగరిక పశువులనే యూహించు కొనేవారుకూడ లేకపోలేదు వారి దృష్టిలో భోగలాలసత్వమే నాగరికత. నీతి గలిగి నియతగతి వ్యవహరించు శీలురు వీరి దృష్టిలో కొఱగానివారు. ఈ రీతిగా నాగరికత అభివృద్ధి చెందుట వలన మానవునకు లభించిన భౌతిక సౌఖ్యము నాశ్రయించి మానవుడు నాగరికతను అపార్థము జేసుకొంటున్నాడు. [సశేషం]

## పాక్ భారతఎల్లల చర్చలకు ఏర్పాటు

చండీగడ్, ఏప్రిల్ 8. పాకిస్థాన్ భారతదేశాలమధ్య సరిహద్దుల నిర్ణయం కోసం పర్యేయర్ స జనరల్ స సమావేశానికి ఏర్పాటు చేయ్యడానికిగాను భారతప్రభుత్వ కామన్వెల్త్ వ్యవహారాలమంత్రి [illegible] పంజాబు రాష్ట్రప్రభుత్వ ఉన్నతోద్యోగులను కలుసుకుని చర్చలు జరిపారు. ఈ చర్చలలో పంజాబు సాయుధపోలీసు అధికారి, సంబంధ జిల్లాల డిప్యూటీ కమిషనర్లుకూడా పాల్గొన్నారు.

## సంపాదకునకు లేఖ

### నేటి విశాఖపట్నం

ఆర్యా, ఆంధ్రదేశ పారిశ్రామిక పట్టణమని, సహజ సౌకర్యకేంద్రమని అప్పుడప్పుడు పత్రికలలో విశాఖపట్నం గూర్చి ప్రకటించబడినదాని ఆంధ్రదేశ పౌరులు ఆనందించడం జరుగుతోంది. అయితే "అంగట్లో అన్నీ ఉన్నాయి అల్లునినోట్లో శని"అన్నటు, ఆంధ్ర విశ్వవిద్యాలయము ప్రభుత్వ ఆసుపత్రి, విమాన రైల్వే కేంద్రములు, కాల్టెక్సుసూనె శుద్ధి కార్ఖానాగారము మొదలయిన సంసలెన్ని ఉన్నా విశాఖపట్నం పౌరులకు ఏ విషయంలోనూ సౌఖ్యంలేదు. ఒక వైపు గాజువాక, మల్కాపురంలవరకు, ఇంకొక వైపు పెందుర్తి వరకు, వేరొక వైపు వాల్తేరు అప్‌లాండ్సువరకు పట్టణం విస్తరించబడి ఎన్నిసిటీ బస్సులున్నా, వాల్తేరు రైలుస్టేషన్ నుండి బయలుదేరి ఆంధ్ర విశ్వవిద్యాలయము చేరుకొనే వ్యక్తి ఒక దక్షయజ్ఞం చేయవలసి వచ్చుచున్నది. దీనికి కారణం పట్టణం పొడుగేకాని వెడల్పులేక ఒక్క మెయిన్ రోడ్ మాత్రమే ఈ సిటీ బస్సులకు ఆధారమగుచున్నది. తూర్పున సముద్రం, పడమర పారిస్ సెంట్ మక్కు కు వ్రాసుకొన్నా నిష్ప్రయోజనమనిపించే ఉప్పుటేరు, పట్టణానికి మధ్యను పెద్దకొండ గలిగి పట్టణ విస్తరణ పొడుగులో తప్ప, వెడల్పులో గోచరించుటకు అవకాశములేక ఎగుడు దిగుడు కలిగిన "పెదగొప్ప ఊరు దిబ్బ" అన్న సామెతకు తగినట్లు దిబ్బలపట్నమై కన్పట్టను. ఈ మధ్యను కొన్ని భాగాలు పురపాలక సంఘం స్వాధీనమయినవి. అక్కడక్కడ క్లేటి ఇండ్లకు దారీ లెన్నా లేదు. టౌన్ ప్లానింగు కొలగర్భంలో కలిసిపోయిందేమో అన్న అనుమానం కలుగకమానదు. సంస్థలు రోజు రోజుకు పెరిగినట్లే జనాభాకూడా పెరిగి పోవుచున్నది. అందుచేత నేటి ఇండ్లసమస్య చెప్పతరం కాదు. కార్మికులకు తగిన గృహవసతి కలగనిదే ఈ ఇండ్లసమస్య తీరదు. అద్దెలకోసం ఇండ్లు ఇచ్చుట అనేక విధాలుగ మారిపోతాయి. క్రొత్త అగ్రహారం, మొదలయిన ప్రదేశాలలో చాలా ఇండ్లకు రోడ్లులేవు. చాలవరకు జనం సాగరతీరమును స్వేచ్ఛగా వాడుకొంటుంటారు. సాయంత్రం చల్లగాలికి బీచికి వెళ్లేవారిని దుర్గంధములుదూరంగా తరిమి వేస్తుంటాయి. పురపాలకసంఘం వారు ఇచ్చే జీతాలతో సంతృప్తిలేక రోడ్లు తుడిచేవారు, కాలువలు తుడిచేవారు, రోడ్లు తుడిచేవారు ఇంటింటికి సెలవారీ జీతాలు ఏర్పాటుచేసి ఇచ్చేదాకా పట్టుపట్టి అల్లరిచేసి పీడించి వదులుతారు. మంచినీళ్ల విషయంలో పూర్వంనుండీ ఉన్న "విశాఖపట్నం చెంబు" అన్న పేరు నేటికీ సార్థకమవుచున్నది. వీధికొళాయిలు, నీళ్ల బిందెలు మోసి సెలజీతాలు సంపాదించే పాటకజన ఆధీనంలోనే ఉంటాయి. సామాన్య కుటుంబీకులకు, పాటలకు నోరులేనివారికి, ఒక్క చుక్కైనా నీళ్లుకూడా దొరకవు. కాలువల దుర్వాసన, దోమలబాధ చెప్పతరం కాదు. ఈ ఇబ్బందులతో పురప్రజలు సతతం ఉక్కిరిబిక్కిరి అవుతుంటారు. జీవితప్రమాణంలో కేవలం ఆంధ్రదేశమునకేగాక, హిందూదేశమునకే విశాఖపట్నం ప్రథమస్థానము వహించుచుమటలో సతిశయోక్తిలేదు, ఇండ్లసమస్య, మంచినీటి సమస్యలలో ఇబ్బంది పడుచున్న ఈ ప్రదేశంలోనే ఇంకా కొన్ని ప్రధాన సంస్థలు పెట్టుటకు ఆంధ్ర ప్రభుత్వము యోచించుటలో తగిన న్యాయము లేదని గోచరించుచున్నది. విశాఖపట్నంకు దగ్గరగా గల కాకినాడలో గాని అనేకఖాళీస్థలములు, భవనములు కలిగి జమీందారీ స్థలమని ఒక ప్రభుత్వ సంస్థయైన లేని విజయనగరంలో గాని కొన్ని సంస్థలు నెలకొల్పినచో మానవుని జీవితావసర సమస్యలు కొన్ని పరిష్కారమగుటకు అవకాశమున్నది.

నేటికైనా స్థానిక పురపాలకసంఘం ఆంధ్ర ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం విశాఖపట్నం పౌరుల ఇబ్బందులు తొలగి ప్రజాప్రభుత్వంలో ప్రజాభిప్రాయానికి తగిన విలువ ఇచ్చి ప్రజావసరములు తీరుటకు తగిన చర్యలు తీసికొంటారని అందుకు తగినట్లు విశాఖపట్నం పౌరులు తమ విద్యుక్త ధర్మములను గుర్తెరిగి తమసహాయ, సహకార, సానుభూతుల నిచ్చి సంఘటిత కృషికి ఆశయ సిద్ధికి తోడ్పడెదరని ఆశిస్తూ తెలియజేస్తున్నాను.

విశాఖపట్నం. నూతి నారాయణరావు.

## పార్లమెంటు సభ్యులకు విదేశ భాషల బోధ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 8: లోక్ సభ సభాపతి శ్రీ మాడభూషి అనంతశయనం అయ్యంగార్, పార్లమెంటు సభ్యులకు విదేశ భాషలు బోధించే ఒక పాఠశాలకు ప్రారంభోత్సవం చేశారు.

ఢిల్లీ విద్యా, పారిశ్రామిక సహకార సంఘం, యీ పాఠశాలను నిర్వహిస్తున్నది. దాదాపు 25 మంది పార్లమెంటు సభ్యులు, 75 మంది యితరులు యీ పాఠశాలలో ప్రవేశానికి దరఖాస్తులు పంపారు.

ఈ పాఠశాలలో మొదట, రష్యన్, జర్మన్, ఫ్రెంచి భాషలు నేర్పుతారు.

ఉపాధ్యాయ వర్గంలో పార్లమెంటు సభ్యులు డాక్టరు సత్యనారాయణ సిన్హా, డాక్టర్ సురేశచంద్ర ఉన్నారు. డాక్టర్ సిన్హా, రష్యన్, జర్మన్ భాషలనూ డాక్టర్ సురేశచంద్ర ఫ్రెంచి భాషనూ బోధిస్తారు.

